# హడ్సన్ టేలర్

## చైనా మిషనరీ జీవిత చరిత్ర



# హడ్సన్ టేలర్

చైనాలో సేవ చేసిన గొప్ప మిషనరీ



A Gospelfamily Product




గాస్పల్[IND] ఫ్యామిలి

www.gospelfamily.in

www.gospelneeds.com

# హడ్సన్ టేలర్

సెప్టెంబర్ 19వ తేదీ 1853వ సంవత్సరము. మూడు తెరచాపలు కట్టిన ఆ ఓడ ఇంగ్లాండులోని లివర్‌పూల్ రేవు పట్టణములో నుండి సముద్రములోనికి ప్రవేశించింది. డెక్‌పై 21 సంవత్సరాల యువకుడు తన కోటు జేబుల్లో చేతులు పెట్టుకొని "ప్రభువా! సహాయం చేయి" అని ప్రార్థిస్తున్నాడు. మరొక ప్రయాణికుడు వచ్చి ఆ యువకుడిని పలుకరించాడు.

"చాల చలిగా ఉంది కదా?"

"అవునండీ!"



"ఎక్కడకు వెళ్తున్నారు?"

"చైనాకు"

"అక్కడ మీ బంధువులు ఉన్నారా?"

"ఎవరూ లేరు. నేను సువార్త ప్రకటించడానికి వెళ్తున్నాను."

"మీ పేరు "

"హడ్సన్ టేలర్"

✡ ✡ ✡

జేమ్స్, ఎమీలియా గార్లకు హడ్సన్ టేలర్ పుట్టినప్పుడు "ఈ నా కుమారుడు మీ కొరకు చైనాలో పనిచేయాలి" అని



www.gospelneeds.com

ప్రార్థించారు. మెథడిస్ట్ సంఘానికి చెందిన జేమ్స్ అప్పుడప్పుడు సంఘములో వాక్యోపదేశం చేసేవాడు. యవ్వనములో హడ్సన్ టేలర్ నిజమైన క్రైస్తవుడిగా జీవించాలని అనుకొన్నాడు. అనేక సార్లు విఫలమయ్యాడు. అందువలన క్రైస్తవ్యాన్ని పూర్తిగా విడిచి పెట్టాలని అనుకొన్నాడు. కాని హడ్సన్ గురించి అతని తల్లి అమీలియా పట్టువదలక ప్రార్థిస్తూ ఉండేది. ఒక రోజు హడ్సన్ తన తండ్రి గది లోనికి వెళ్లాడు.

జేమ్సు గారు అప్పుడప్పుడు ప్రసంగము చేసేవారు గనుక అతని టేబుల్‌పై అనేక మత సంబంధమైన పుస్తకములు ఉన్నవి. చాల కరపత్రికలు ఉన్నవి. హడ్సన్‌కు ఏమీ తోచక ఒక కరపత్రిక తీసుకొని చదవడం ప్రారంభించాడు.

సరిగ్గా అదే సమయానికి అతని తల్లి 80 మైళ్ల దూరములో ఉన్న ఒక ఊరిలో హడ్సన్ మారు మనస్సు గురించి ప్రార్థిస్తూ ఉన్నది. ఈ రోజు హడ్సన్ మారు మనస్సు పొందేవరకు నేను మోకాళ్లపై నుండి లేవను అని అమీలియా పట్టువదలక ప్రార్థిస్తూ ఉన్నది.

హడ్సన్ కరపత్రికను చదువుచుండగా

www.gospelneeds.com

పరిశుద్ధాత్మ అతనిలో పనిచేసి నందువలన హడ్సన్ కన్నీరు కారుస్తూ మోకాళ్లపై క్రుంగి తన పాపములను క్షమించమని దేవునిని కన్నీటితో వేడుకొన్నాడు. హడ్సన్ చదివిన కరపత్రిక పేరు Poor Richard. ఆశ్చర్యకరమైన విషయమేమనగా హడ్సన్ మారు మనస్సు పొందిన మరుక్షణం అతని తల్లి మోకాళ్లపైనుండి లేచా కుర్చీలో కూర్చుని "కృతజ్ఞతలు ప్రభువా" అని దేవునిని స్తుతించుట ప్రారంభించినది. హడ్సన్ కరపత్రిక చదివి నప్పుడు అతని వయస్సు 14 సంవత్సరములు. హడ్సన్ సోదరి కూడ అతని మారుమనస్సు కొరకు నెల రోజుల నుండి ప్రార్థిస్తూ ఉన్నది.

అమీలియా మాత్రమే కాదు అనేక మంది తల్లులు తమ బిడ్డల కొరకు భారములో ప్రార్థించారు. జాన్ వెస్లీ గురించి అతడి తల్లి సూసన్ , అగస్టీన్ గురించి అతని తల్లి మోనికా ఎంతో భారముతో ప్రార్థించారు. తమ పిల్లలు భౌతికముగా మరణిస్తే ఎలా విలపిస్తారో ఆ విధముగా వారి ఆత్మీయచావు గురించి అంతకంటే ఎక్కువగా విలపించారు. అలాగే నైరుతి చైనాలో ఉన్న లిసూ జాతి ప్రజలకు సువార్త ప్రకటించుటకు వెళ్లిన జేమ్స్ ఫ్రేజర్ రక్షింపబడుటకు అతని తల్లి

www.gospelneeds.com

ప్రార్థనే కారణము. సిట్జర్లాండ్‌లో ఉజ్జీవము తీసుకొని వచ్చిన జ్వింగ్లీ (Muldrych Zwingly) విజయము వెనుక అతని తల్లి ప్రార్థన ఉన్నది. (ఈపుస్తకము చదువుచున్న తల్లులకు ఒక విన్నపము. మీ బిడ్డల నిమిత్తము కన్నీరు కార్చండి. మీ కుమారుడు మరొక హడ్సన్ టేలర్ కావచ్చును.మరొక జాన్ వెస్లీ అయి ఉజ్జీవము తీసుకొని రావచ్చును)

హడ్సన్ టేలర్ చైనాలో సువార్త ప్రకటించుటకు వెళ్లాలి కనుక వైద్యశాస్త్రాన్ని అభ్యసించాడు. చైనాలో ఎక్కువమంది మాట్లాడే మాండరిన్ భాషను నేర్చుకున్నాడు. హడ్సన్ టేలర్ గారు చైనా వెళ్లుటకు ఓడ ఎక్కిన తరువాత ఓడ సుమత్రా ద్వీపం చేరునప్పటికి ఓడ కెప్టెను వచ్చి “టేలర్ గారూ! గాలి వీచుట లేదు, దగ్గర్లో నరమాంస భక్షకుల ద్వీపమున్నదని మా అనుమానం” అనెను. టేలర్ గారు నేనేం చేయాలి? అనెను. “మీరు దేవునిని నమ్ముతారని మాకు తెలియును. గాలి కొరకు ప్రార్థన చేయండి” అని కెప్టెన్ అనెను. “అలాగే ప్రార్థిస్తాను. కాని నీవు తెరచాపలు కట్టాలి” అని టేలర్ గారు అన్నారు. “ఎందుకు? కొంచెం గాలి కూడ

www.gospelneeds.com

లేదు. ఇప్పుడు తెరచాపలు కట్టమంటే నావికులంతా నన్నొక పిచ్చివాడి క్రింద జమచేస్తారు" అని కెప్టెన్ అనెను. కానీ టేలర్ బలవంతముచే ఒప్పుకొనెను. 45 నిముషముల తరువాత అతడు తిరిగి వచ్చి టేలర్ గారు ఇంకా మోకాళ్లమీద ఉండుట చూచి "అయ్యా! ఇక చాలు. సరిపడు నంతకంటే ఎక్కువ గాలి వీస్తున్నది" అనెను. మనము ముందుకు వెళ్లాలంటే మోకాళ్లపై వేగంగా వెళ్లగలము అనేవారు.

టేలర్ గారికి ఉన్నంత గొప్ప విశ్వాసం మనకు లేకపోవచ్చు కాని ఆయనకు ఉన్న గొప్ప దేవుడే మనకు ఉన్నాడు. **మీరు ప్రార్థించినపుడే అడుగు వాటినెల్ల పొందియున్నామని నమ్ముడి. మార్కు 11 : 24.**

చైనాకు ప్రయాణమై వెళ్లుట ఐరోపా ప్రజలకు ఎంతో ధైర్యము ఓపిక ఉండవలెను. ఆ రోజులలో లండన్ నుండి రోమ్‌కు ప్రయాణము చేయుటయే ఎంతో దూరమైన ప్రయాణముగా భావించేవారు. రోమ్ నుండి లండన్‌కు దూరము 1000 మైళ్లు. అప్పట్లో చైనా రాజధాని అయిన చాంగ్ఆన్‌కు దూరము 5000 మైళ్లు. అందువలన టేలర్ గారి మొదటి ప్రయాణము ఎంతో సమయము

తీసుకొన్నది.

అప్పటి వరకు చైనా వెళ్లిన మిషనెరీలు చేయని పనిని హడ్సన్ టేలర్ చేసాడు. అతడు షాంగై రేవు పట్నంలో దిగగానే చైనా వారివలె దుస్తులు ధరించాడు. చైనాలోని మగవారు వేసుకునే విధముగా జడ వేసుకున్నాడు. హడ్సన్ టేలర్ గారు చైనాకు చేరిన తరువాత తాను ఉంటున్న పెద్ద ఇంటిని ఖాళీచేసి ఒక చిన్న యింటి లోనికి మారారు. దానికి రెండు కారణములు కలవు. ఒకటి చుట్టు ప్రక్కల చైనా భాష మాటలాడువారు ఉండిన యెడల తాను త్వరగా భాష నేర్చుకో వచ్చుననీ, చైనీయులతో పరిచయము పెంచుకొనవచ్చునని తలంచారు. రెండవ కారణం అద్దె తక్కువ గనుక కొంత డబ్బు ఆదా చేయవచ్చునని తలంచారు.

ఒక రోజు ఎక్కడి నుండో 5 పౌండ్లు (రెండున్నర కేజీలు) బరువుగల ఫిరంగి గుండు వచ్చి హడ్సన్ టేలర్‌కు ప్రక్కన ఉన్న గోడకు తాకినది. ఆ ధాటికి ఆయన బాల్కనీపై నుండి ఎగిరి క్రింద పడ్డారు. స్వల్ప గాయములు అయినవి కాని ప్రాణాపాయము కలుగలేదు. ఆ ఫిరంగి గుండును హడ్సన్ గారి తల్లి దేవుడు తమను రక్షించినందుకు గుర్తుగా దాచి

www.gospelneeds.com

యుంచినది. ఆ గుండును చూచినప్పుడెల్లా దేవుడు తమను ఎట్లు రక్షించినాడో జ్ఞాపకము చేసికొనెడివారు. శ్రమలు, శోధనలు వచ్చునప్పుడు హడ్సన్ కంగారు పడకుండా తుఫాను గట్టిగా వచ్చినప్పుడే బలమైన చెట్లు ఏవో తెలుస్తాయి అనేవారు.

తనకు ముందు వచ్చిన మిషనెరీలు నగరాలలోనే మకాము ఉండి సువార్త ప్రకటిస్తున్నారు కాని పల్లె ప్రాంతములకు వెళ్లుట లేదు. అందు వలన హడ్సన్ టేలర్ చైనా భాషలో ముద్రించబడిన కరపత్రికలను తీసుకొని హుంగపు నది దాటి గ్రామీణ ప్రజలకు పంచుతూ వెళ్లారు.

నాలుగు సంవత్సరములు గడిచేసరికి హడ్సన్ టేలర్‌ను చైనాకు పంపుటకు సహాయం చేసిన చైనీస్ ఎవాంజిలేషన్ సొసైటీకి సరిపడే నిధులు లేనందువలన తన మిషనెరీలందరినీ వెనక్కి రమ్మని ఆజ్ఞాపించారు. టేలర్ సొసైటీకి రాజీనామా జేసి తన అవసరముల నిమిత్తం దేవునిపై ఆధార పడ్డాడు. చైనాలో సేవచేయుటకు వచ్చి మరణించిన సామ్యూల్ డయ్యర్ కుమార్తె మేరియా జేన్‌ను వివాహం చేసుకున్నాడు. నింగ్‌పో అనే గ్రామములో చిన్న చర్చిని

స్థాపించాడు. సంఘ సభ్యులు 21 మంది అయిన తరువాత టేలర్ అనారోగ్యం పాలగుటవలన మరల ఇంగ్లాండుకు తిరిగి వచ్చినాడు. ఆరోగ్యం కుదుటపడగానే చైనాలో ఉండగా ప్రారంభించిన బైబిల్ తర్జుమాను పూర్తిచేసాడు. అనేక సంఘములను దర్శించి చైనాలో ఉన్న సేవ గురించి వివరించి అనేకమందిని మిషనెరీలుగా వెళ్లుటకు పురికొల్పాడు. తాను స్వయంగా చైనా ఇన్‌లాండు మిషన్‌ని స్థాపించాడు. ఆ సభ్యులందరూ చైనా దుస్తులనే ధరించాలి.

సిహెచ్. స్పర్జన్ గారు అప్పట్లో మెట్రోపాలిటన్ టేబర్నికల్‌కు పాస్టర్‌గా ఉండిరి. ఆయన టేలర్ గారి కృషి గురించి విని తన మరణ పర్యంతము టేలర్ గారికి సహాయ పడుచుండిరి. టేలర్ తన నలుగురు పిల్లలు, 16 మంది మిషనెరీలతో మరల 26-5-1866న బయలుదేరి 4 నెలలలో చైనా చేరాడు.

అప్పటికి చైనా ఇన్‌లాండు మిషన్‌లో 5గురు చైనాలోనే పనిచేయుచుండిరి. డాక్టర్‌గా 200 మంది పేషెంట్లకు ప్రతి దినము చికిత్స చేయుచుండెను. అందువలన సువార్త ప్రకటించుటకు ఎక్కువ సమయము

www.gospelneeds.com

వినియోగించుట లేదని కొందరు మిషనెరీలు టేలర్‌ను విడిచి వేరొక సంస్థలలో చేరిరి. టేలర్ యొుక్క పట్టుదలచూచి అనేకమంది చైనా - ఇన్‌లాండు మిషన్‌లో చేరుచుండిరి. అవిశ్రాంతమైన పనివలన టేలర్ ఎంతో శుష్కించి పోయెను. గోరుచుట్టుపై రోకలిపోటులా అతని భార్య మేరియా తన 33వ యేట కలరా వలన మరణించినది.

పుట్టిన 8 మంది పిల్లలలో నలుగురు 10 ఏండ్లు రాకముందే మరణించిరి. షాంగైలో నిల్వచేసిన ఖరీదైన మందులు గల ఇల్లు అగ్ని ప్రమాదమునకు గురియై మందులన్నీ కాలిపోయినవి. 1856 అక్టోబర్ నెలలో దోపిడి దొంగలు టేలర్‌పై దాడిచేసి అతనికున్న సమస్తము దోచుకొనిపోయిరి. ప్రతీదానికి దేవునిపై ఆధారపడే టేలర్ గారు దేవుని పని యధార్ధంగా చేస్తే వనరులకు ఎప్పుడు కొరత ఉండదు అనేవారు.

చైనా - ఇన్‌లాండు మిషన్ సభ్యులందరూ చైనావారివలె దుస్తులు ధరించుట అనేక విమర్శలకు గురిఅయినది. టేలర్ గారు మాత్రము పౌలు భక్తుడు 1 కొరింథీ 9 : 20లో చెప్పినట్లు తాను చైనా వారిని

www.gospelneeds.com

సంపాదించుకొనుటకు చైనావారివలె దుస్తులు ధరించుచున్నానని చెప్పెడివాడు. యాంగ్‌జో అనే ప్రాంతములో సువార్తను ప్రకటించుటకు వెళ్లినప్పుడు వారి మిషన్ ఆఫీసు ఉన్న ఇంటిని విప్లవ కారులు దోచుకొని తగులబెట్టారు. ఆ దాడిలో అనేకమంది మిషనెరీలు గాయపడ్డారు. కాని ఎవరూ మరణించలేదు.

బ్రిటీష్ జాతీయులపై దాడి జరిగినందుకు బ్రిటీష్ సైన్యము చైనాపై యుద్ధం ప్రకటించింది. యుద్ధము ప్రారంభమగుటకు టేలర్ కారణమని బ్రిటీష్ పత్రికలన్నీ సంపాదకీయములో వ్రాసినవి. అయితే టేలర్ చర్య తీసుకొమ్మని బ్రిటీష్ మిలటరీని ఎన్నడూ కోరలేదు. బ్రిటీష్ పార్లమెంటులో ఈ విషయం చర్చకు వచ్చి చైనాలో ఉన్న బ్రిటీష్ మిషనెరీలందరూ తిరిగి రావాలనే ఆజ్ఞ జారీ అయినది.

1871లో చైనా - ఇన్‌లాండు మిషన్‌లో పని చేస్తున్న జెన్నీ ఫాల్డింగ్‌న వివాహంచేసుకున్నారు. జెన్నీ 1866 నుండి అతనితో కలిసి చైనా - ఇన్‌లాండు మిషన్‌లో పనిచేయుచున్నది. 1876లో తాను ఒంటరిగా చైనాకు బయల్దేరాడు. జెన్నీకి ఇద్దరు పిల్లలు కలిగినారు. మొదట

www.gospelneeds.com

పుట్టిన కుమార్తె పేరు ఎమీ. ఇంగ్లండు వచ్చి సంవత్సరము గడిచిన తర్వాత తన ముగ్గురు పిల్లలన (బెర్టీ, ఫ్రెడ్డీ, మేరియా) ఎమిలీ మిస్ గారి సంరక్షణలో ఉంచి తాము తిరిగి చైనా వెళ్లారు. రెండు సంవత్సరముల తర్వాత (1873) ఎమిలీ మిస్ గారు ఆకస్మికముగా మరణించుట వలన తిరిగి ఇంగ్లండుకు రావలసి వచ్చినది.

కుమారుడైన ఎర్నెస్ట్ 8 నెలల పసికందు గనుక టేలర్ 18 మంది మిషనెరీలతో చైనా చేరినాడు. ఇప్పుడు బ్రిటన్‌కు, చైనాకు చీఫూలో సంధి కుదిరినందువలన సువార్త ప్రకటించుటకు ఆటంకములేమీ లేవు. 2 సంవత్సరముల తర్వాత జెన్నీ తన పిల్లలతో చైనా వచ్చి స్త్రీల మిషనెరీలను అభివృద్ధి పరచినది. ఇప్పుడు చైనాలో 225 మంది మిషనెరీలు పనిచేయుచున్నారు. 59 చర్చిలు స్థాపించబడినవి. అంత వరకు కేవలము ఇంగ్లండు నుండి మాత్రమే చైనాకు మిషనెరీలు వచ్చుచుండిరి. డి.యల్ మూడీ గారి అభ్యర్థనపై చికాగో వెళ్లిన టేలర్‌గారు అనేక ప్రాంతములలో తన మిషన్ గురించి చెప్పుటవలన అమెరికానుండి 14 మంది మిషనెరీలు చైనాకు వచ్చినారు.

www.gospelneeds.com

హడ్సన్ టేలర్ గారు చైనాలో సువార్త ప్రకటించుటకు సిద్ధపడిన పాస్టర్లను తరచుగా ఒక ప్రశ్న వేసేవారు. మీరెందుకు విదేశములో మిషనెరీగా పనిచేయుటకు సిద్ధపడు చున్నారు? అని ప్రశ్నించేవారు. చాలామంది "యేసు ప్రభువు సువార్త ప్రకటించమని మాకు ఆజ్ఞాపించారు కనుక సువార్త ప్రకటించుటకు చైనా వెళ్లుచున్నాము" అనేవారు.

మరి కొందరు "ప్రభువును ఎరుగకుండా అనేకమంది మరణిస్తున్నారు. అందువల్ల చైనాకు వెళ్లు చున్నాము" అనేవారు. హడ్సన్ గారు "ఇవన్నీ మంచి కారణములే కాని శ్రమలు, శోధనలు కష్టములు వచ్చినపుడు మీరు తొట్రిల్లుతారు. ఒకే ఒక దృక్పథము కలిగి ఉన్నయెడల మీరు ఎన్ని శోధనలు అయినా తట్టుకోగలరు. ఆ దృక్పథము ఏదనగా **క్రీస్తు ప్రేమ**" అని అన్నారు. క్రీస్తు ప్రేమ మనలో ఉన్న యెడల మనకు ఎన్ని అవరోధములు వచ్చినా వాటిని జయించగలము. **క్రీస్తు ప్రేమ మమ్మును బలవంతము చేయుచున్నది. 2 కొరింథీ 5 : 14**

బైబిల్ వ్యాఖ్యానం వ్రాసిన స్కోఫీల్డ్ గారు టేలర్‌కు మంచి మిత్రులైరి. తర్వాత

కాలములో మూడీగారు, స్కోఫీల్డ్‌గారు చైనా – ఇన్‌లాండు మిషన్‌కు ఎంతో సహాయం చేసారు.

సంతానం : టేలర్ గారికి మేరియా డయ్యర్ వలన 9 మంది జన్మించిననూ వారిలో 5 గురు బాల్యమందే మరణించిరి. భార్య మరణించిన తర్వాత జెన్నీని వివాహంచేసుకొనగా ఆమెకు నలుగురు జన్మించిననూ ఇద్దరు పురిటిలోనే మరణించిరి. ఆయనకు కుమార్తె మేరియా జోసెఫ్ కౌల్ట్‌హోర్డ్ అనే మిషనెరీని వివాహము చేసుకున్నది. ఆమెకు నలుగురు పిల్లలు పుట్టిన తర్వాత తన 30వ యేట మరణించుట వలన ఆ నలుగురు పిల్లల బాధ్యత కూడ టేలర్ గారే స్వీకరించారు.

1900లో బాక్సర్ విప్లవం చెలరేగినది. విదేశీ సంస్కృతి తమ చైనా సంస్కృతిని నాశనం చేయుచున్నదని చైనా దేశస్తులు విజృంభించి 58 మిషెనరీలను 21 మంది పిల్లలను హతమార్చారు. ఆ సమయమందు ఆస్తినష్టము, ప్రాణ నష్టము జరిపినందుకు చైనా వారు నష్టపరిహారము ఇచ్చెదమని చెప్పిననూ టేలర్ పుచ్చుకొనుటకు అంగీకరించలేదు.

www.gospelneeds.com

అందువలన చైనా దేశములో ఆయన ప్రతిష్ట పెరిగెను.

తన భార్యయైన జెన్నీ కేన్సర్ వ్యాధితో బాధపడుట వలన చికిత్స నిమిత్తము స్విట్జర్లాండు వెళ్లిరి. ఆమె అక్కడ 1904లో మరణించెను. తన ఆరోగ్యము క్షీణించిననూ 1905లో టేలర్ చైనాకు వచ్చి ఛాంగ్ షా అనే ప్రాంతంలో జూన్ 3వ తేదీ 1905లో ప్రభువునందు నిద్రించెను. అప్పుడు అతని వయస్సు 73 సంవత్సరములు. జెన్‌జియాంగ్‌లో ఉన్న అతని భార్య సమాధి ప్రక్కనే ఆయనను సమాధి చేసిరి. హడ్సన్ టేలర్ జీవిత

గాధను చదివి ఎమీ కర్మిఛాయల్, ఎరిక్‌లిడిల్, జిమ్ ఎలియట్, బిల్లీగ్రాహంగారు స్ఫూర్తిని పొందారు.

హడ్సన్ టేలర్ గారు చైనాలో ఉన్న కాలములో ఒక్క రోజు కూడ తప్పిపోకుండా సూర్యోదయమునకు ముందే మోకాళ్లపై ఉండి ప్రార్ధన చేస్తూ ఉండేవారు.

చైనా మిలియన్స్ అను పత్రికను హడ్సన్ టేలర్ ప్రారంభించారు. ప్రస్తుతము తూర్పు ఆసియా మిలియన్స్ అను పేరుతో ప్రచురింపబడుచున్నది.

www.gospelneeds.com

